శ్రీలేఖ సాహితి
కవితా సంకలనం

# ప్రజోత్పత్తి

సంపాదకత్వం :

టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి
5-11-114/4 విద్యారణ్యపురి
వరంగల్లు - 506009

# ప్రజోత్పత్తి

(కవితా సంకలనం)

సంపాదకత్వం :

టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి
5-11-114/4 విద్యారణ్యపురి
వరంగల్లు - 506009

1991

# మా మాట

శ్రీలేఖ సాహితి, వరంగల్లు 15వ వార్షికోత్సవ సందర్భంగాను "స్నేహం నీడనిచ్చే చెట్టులాంటిదనే" భావనతో, పనరుల మేరకు సాహిత్య సభలు నిర్వహిస్తూ, వర్ధమాన కవులకు ఒక వేదికను కల్పించాలనే మా ధ్యేయంలో పాలుపంచుకొని ఈ పుస్తకాన్ని వెలువరించడానికి చేయూతను ఇచ్చిన ఇందులోని కవులకు, మా కార్యవర్గంనకు కృతజ్ఞతలు.

---

"ప్రజోత్పత్తి" ఉగాది (17-3-91)

హక్కులు – సంస్థవి

ప్రచురణ – శ్రీలేఖ సాహితి, పదిహేనవ పుస్తకం

వెల : ఆరు రూపాయలు

ముద్రణ : నటరాజ్ ప్రింటర్స్, కాశిబుగ్గ, వరంగల్

---

ప్రతి ఉగాదికి వెలువరించే కవితా సంకలనాలకు ఇకముందు 'శ్రీలేఖ' అనే పేరును శాశ్వత పరచాలనే నిర్ణయం తీసుకున్నాం. మా ఈ పయనంలో చేయూతను ఇచ్చి ముందు ముందు మరిన్ని కార్యక్రమాల రూపకల్పనకు అవకాశాన్ని సాహితీ మిత్రులు ఔదార్యాలు.... తమ సహృదయతతో.... మరింత ఉదారతతో.... అందిస్తారనే ఆశాభావంతో....

యస్. శ్రీనివాసస్వామి
అధ్యక్షులు

డి.వి. శేషాచార్యులు
సంయుక్త కార్యదర్శి

కళా పారంగతులు

విద్యా సంస్థల పరిపోషకులు

సహృదయ నీరాజనాల

లలిత సహృదయులు

నటనారంగంలో

స్వర్ణోత్సవం జరుపుకుంటున్న

పద్మశ్రీ, కళాప్రపూర్ణ

**డా॥ అక్కినేని నాగేశ్వరరావు గారికి**

మా ఈ చిరు కానుక...

శ్రీలేఖ సాహితి

వరంగల్లు

# మనీషి

- ఎమ్మెస్సా

అవని అంచున నిల్చొని
ఆకాశంలో చుక్కల్ని
విశ్వంలో గ్రహాల గమనాన్ని
గస్మత్తుల లెక్కల్తో లెక్కించే
మనిషి –
తనచుట్టూ – తన ముందర
దీనంగా–హీనంగా నిల్చొన్న
మరో మనిషిని – మహా మనిషిని
కన్నెత్తి చూడలేడు
ఎక్కడో –
ఇరాక్‌లో బాంబుల వర్షం
నా కెందుకులే అన్నభావం
ఢిల్లీలోనా! గల్లీలోనా!
చలనంలేదు – చలనంరాదు
అదో!
నా ఇంటిమీద అగ్ని వర్షం
ఎదురింటి వాడికి ఎందుకు హర్షం?
ఛీ! ఛీ! వాళ్లు మనుషులు కారు!!
మహా మనుషులువారు.

# అమరవీరపూజ

— చిటిప్రోలు వెంకటరత్నం

జన్మ స్థలసంక్షేమంకోసం
జన్మం ఒడ్డిన అమరవీరులకు
ఇవియే నా జోహరుల్ – ఆగళ
రవమే నా కొక హారం, హీరం
సంతోషం, సౌఖ్యం బయలుగ నిడి
సర్వత్యాగం భోగంగా వరి
యించి అనంతజనాళి నివాళుల
నెత్తే పుణ్యం గడియించారా!
అవనీస్థలిపై ఈ నరతనువున్
అందిన యందుకు అమ్మ పదద్వయా
ముందున అర్పణ మొనరిచి జన్మకు
సార్థకభావం సాధించారా!
మీ దివ్యస్మృతిలో దరులొరసే
గోదావరిలా మా యెద లందున
సేవాభావం చావని ప్రాణం
తో వెలుగిస్తూ పరువెత్తాలిక.

ఇం.నెం. 14/64/1, గీతామందిరం దగ్గర, మిర్యాలగూడ, నల్లగొండ.

# కామనాగీతి

— భువనగిరి నాగరాజు

వెన్నెల సుఖమైనా చూడక
మట్టి ముద్దల్లా ముడుచుకున్న ఉక్కుపిడికిళ్ళను
ఆరిపోని అగ్నిశిఖలుగా మండించాలని
గుండెల తంత్రుల్ని శృతి చేస్తున్న వాణ్ణి!
నవ్వుల సుఖమైనా తెలియక
కన్నీటి శృంఖలాల్లో బందీలైన కలలకు
ఆశల రెక్కల్ని మొలిపించి
ఆకాశంలో ఎగరడాన్ని నేర్పుతున్న వాణ్ణి!
నన్నిలా వేధించకు—
వసంతాల వాసనైనా సోకక
ఎండిపోయిన ఎడారుల్ని కౌగిలించి
చైత్రవనాల్లా పరిమళింపచేయాలని
సలిలామృతధారనై పరుగు తీస్తున్నవాణ్ణి!
ఓదేవా! కాలచక్రాన్నిగిర్రున తిప్పి
ఎదలో మరో క్రొత్త సంవత్సరం బాకును గుచ్చి
నన్ను మరీ మరీ శోధించకు—
నాకిక్కడ అక్షరాల ఢమరుకం వినిపించి....
నివుర్లు కమ్మిన నిప్పురవ్వల్ని నిద్రలేపాలని వుంది!
కలాన్ని దివిటీగా చేసి
ముందు దారి చూపించాలనుంది!
చీకటి లోయల్లో నడుస్తున్న మనిషిని
వెలుగుల కోటలో సూర్యునిలా వెలిగించాలనుంది!!

6-3-182/ఎ, మంచాల వీధి, తిరుపతి - 517507

# ప్రజోత్పత్తి – అవతారమెత్తి...

– రాధిక

రావమ్మా ప్రజోత్పత్తి
కోకిలపై గొంతెత్తి
గీతంలోని భాషచూడక పలుకు సంగీతం, ఒత్తి
పులివై పంజా ఎత్తి
ఆకలి లేళ్ళను రూపు మాపు అదే నీ వృత్తి
సింగంపై ధ్వజమెత్తి
అంగడి ధరలు పెరగకుండా నరకడానికి కావాలి నీజూలు కత్తి
ఏనుగుపై తొండమెత్తి
పీనుగులు కాకుండా చూడు ప్రాణుల నిష్పత్తి
ఎలుగువై ఎలుగెత్తి
వెలుగువైపు నడిచేలా మార్చు మనుజుల ప్రవృత్తి
పామువై పడగనెత్తి
దుర్మార్గుల కాళ్ళపై కాటువేసి పెట్టు మణిని మా నెత్తి
మహిషివై కాలెత్తి
పండని నేలను సాగుచేసి పెంచు ఉత్పత్తి
మనిషివై నీతి అనే పత్తిని
నూనె దీపంలో వేసి వెలిగించు కాంతి వత్తి
భరత మాతపై జండాఎత్తి
అసమానతల అపోహలను చేయినివృత్తి

డి-16, డాక్టర్స్ క్వార్టర్స్, మహారాణిపేట, విశాఖపట్నం

# విచ్యుతి

– మొహమ్మద్ నవా అలీ

విజ్ఞానం వెఱ్ఱితలలు వేస్తున్నది
బ్రతుకు పిచ్చిపూలు పూస్తున్నది
శతాబ్దాల తరబడి కావించిన ప్రయోగాల ఫలితంగా
పాదయాత్రకు స్వస్తి వాచకం పలికి
శబ్ద తరంగ వేగాన్ని మించి
మేధస్సుతో రోదసి కెగురుతున్న నరుడు
పాలుతాగి రొమ్ముగుద్దు కృతఘ్నుడు
నేలతల్లి గుండెలపై బాంబుల రువ్వుతున్నాడు.
మానవతామానినీ మానధనమును
కొల్లగొట్టి వికృతంగా నవ్వుతున్నాడు
సమిష్టి కుటుంబాన్ని కాదని వేరు కాపురం పెట్టిన
కనిష్టుని కమిచీ దెబ్బకు తెగింది రక్తబంధం
"సల్లమందుభాయి" గుండెల్లో మండి గుప్పుమన్న
కుళ్ళు వలన వీగిపోయింది మైత్రీగంధం.

ఇం.నెం. 8-22, నేతాజీరోడ్డు, నర్సంపేట-506132, వరంగల్లు.

# మతం పేరిట మారణహోమాలు

– జన్ను కుమార్

మతం పేరట మారణహోమాలు
మనుషుల హా... హా.... కారాలు
మనిషిని మనిషి చంపుకునే
ఈ దుష్ట సిద్ధాంతాలు ఎందుకు ?
ఈ సాంప్రదాయం ఎవరి కోసం ?
నీ దారుణ అరాచకానికి ఈ జనులు
బిక్కు బిక్కు మంటూ
దిక్కులేక, చావలేక, బ్రతకలేక
ప్రాణాన్ని అరచేతుల్లో పెట్టుకొని
అన్నమో ! రామచంద్ర అని విలపిస్తున్నారు
వారిని ఆదుకునేదెవరు

కానీ ...
ఒకటి మాత్రం నిజం
ఓ మనిషీ ....
సాటి మనిషిని నువ్వు చంపితే
నీ నీడ నిన్ను వెంటాడు తుంది
ఏదో ఒకనాడు నీకు కూడా
ఇదేగతి పడుతుంది
నీలోని రాక్షసత్వాన్ని తీసివేయి
నీ శక్తి యుక్తులతో
దేశాన్ని నందనవనం చేయి.

ఇం.నెం. 14-6-153, నిజాంపుర, మండిబజార్, వరంగల్-506002

# భూత విషాదం

— షోలోజు వెంకటాచారి

పృథివి బాధపడుతోంది
అమాయకుల రక్తం
అరాచక శక్తుల చేతుల్లో చింది
తనపై ఒలుకుతున్నందుకు.
ఆకాశం విలపిస్తోంది
కట్నం చితి పొగలు
తనను ఉక్కిరి బిక్కిరి
చేస్తున్నందుకు.
అగ్ని బాధ పడుతోంది
కుల రక్కసి బలవంతంగా
బడుగు గుడిసెల్ని భస్మీపటలం
చేస్తున్నందుకు.
గాలి విలవిలలాడుతోంది
సహజ సిద్ధమైన తనను
వికృతం చేసుకొని
రోగాల బారిన పడుతున్నప్పుడు.
నదుల్లో నీరు బాధపడుతోంది
కలతలకు కలవరపడి
వెతలకు క్రుంగి, కొన్ని జీవితాలు
అర్థాంతరంగా ముగుస్తున్నందుకు,

ఇం. నెం. 2-117, బోడుప్పల్, హైదరాబాద్-500039

# భావస్వాతిక

— రామభోజ

నా పేరు
కవికోకిల
నా ఊరు
కవితా వాటిక
నా నేత్రం
నిత్యం తిమిరంతో సమరం
నా కాయం
భారతీయం
నా ఊహా జ్వలితం
విశ్వమానవ కళ్యాణం

బి. రాములు, 5—43, సప్తగిరి కాలనీ, కరీంనగర్-505002

# రామప్ప రమణిలో

- పల్లేరు వీరస్వామి

కాకతీయుల తరం—కల్పించె నొక వరం
రామప్ప రాగిణిని – నవజగన్మోహిణిని
కనువిందు సొంపారగ – తానె మదినిండె ఇంపారగా–
చేయెత్తి పిలిచింది – చెలికాడ ననుజేర
దూరంపు చూపుతో – దరిజేర నిల్చింది
అతిలోక సుందరముగా – మయుడు రామప్ప నిలయంబునా–
రాలగుట్టల చెంత – రమ్యావరణ మందు
అడవి పచ్చికలందు – ఆడుతున్నది జాణ
మొగ్గల్లె కెంపూతతో – తాను సిగ్గు పడె నును చెంపతో–
గిరిజనుల కన్నెవలె – వయగార మొలికింది
నెరసాని మనసంత – దొరసావి యయ్యింది
ఎన్ని ఊసులు జెప్పెనో – నా గుండె కొండలు దిరిగెనో–
కొంగెు మర్కట మొకటి .. ఒంటి చేలము లాగ
తరుణి నీ తత్తరము – చిత్తరయై నా మదిని
వల్లెవాటు జీరాడగా – గాలి కెరటాలు గీరాడగా–
రామప్ప చిరు తరంగాల జననంబైన
ధిమి ధిమిత్తకిట యను – నాదనిస్వనములతో
నృత్యాలు చేస్తుండగా – మంచి ముత్యాలు అల్లాడెనా–
నడుము త్రిప్పే నాగిణీ – నృత్య మొనరింప
తొగరు కన్నులతోడ – తొందరించనె నన్ను
కౌగిళ్ళ ఆరాడితిన్ – దారి పొదరిళ్ళ పోనాడితిన్
విరహాన పరువాల – హొయలన్ని చూపితివి
విరియించి తాపమును – పరువెత్త జేసితివి
జతగూడ దిగిరాగవే – నంది బసవన్న దీవించగా–

---

ఇం. నెం. 3-68/24/1 పరకాల, వరంగల్లు-506164

# ఎంత కాలం

దప్పూరి శ్రీధరాచారి

మాటలతో కడుపునింపె
నాయకులున్నంతకాలం
ప్రజలకెలా నిదురొస్తుంది?

స్వార్థ చింతనతో గుడికివచ్చే
భక్తులున్నంతకాలం
దేవుడికెలా నిదురొస్తుంది?

బతుకు కొరకు చదువు చెప్పే
గురువు ఉన్నంతకాలం
చదువరికెలా తెలివొస్తుంది?

స్వప్రయోజనం పొందగోరే
రాజకీయ పార్టీ ఉన్నంత కాలం
దేశమెలా బాగవుతుంది?

స్వలాభంకోసం తెగించే
ఉద్యోగులున్నంతకాలం
ప్రజలకెలా మేలవుతుంది॥

ఇం. నెం. 6-452, పి.ఆర్. టీచర్స్ కాలనీ, అదిలాబాద్-504002

# పొలికేక

— యం. వి. ప్రసన్న

"ప్రజోత్పత్తి" "ప్రజాపతి"
ప్రమాదాల నివృత్తి, ప్రమోదాల సృష్టి
ఉషోదయ తుషార హేమంతంలో
సుమించిన శ్వేత సుమానివా?
చక్కనైన జీవితాల పునాదివా,
తెల్సుకోవాలని ఉన్నది
నీ అంతరంగం తెలుసుకోవాలని ఉన్నది
చీకటి మస్తిష్కంలో కలిగిన చిన్ని ఆలోచనవా!
అజ్ఞానపు అంధకారంలో వెలిగిన
దుర్గంధపు శుక్రుడివా!
శృతి మించిన శ్రమలయలకు
స్పందించని చెక్క బొమ్మవా?
చెక్కభజనల గుత్త వ్యాపారివా?
మూల్గుతున్న మానవత్వపు దీపానివా?
చెలరేగుతున్న దానవత్వపు జ్వాలవా?
అంతు తెలియని వింత పోకడల ప్రజాపతివా
రంకునేర్పిన నాయకత్వపు జంకులేని జడత్వానివా
ప్రజోత్పత్తి! ఎవరునీవు? ఎవరునీవు?
మండే గుండెవా? పూల చెండువా?
విశ్వమానవ పొలికేకవా? విశ్వశాంతి తొలిదూతవా?

5-10-39/సి, కిషన్‌పుర, హన్మకొండ-506001

# గియ్యాలేని చిత్రం

— ఇరెడ్ల సుధాకర్

చిత్రకారుణ్ని కావాలని వుంది
ప్రకృతిలోని అందాలన్ని పరిశీలిస్తా
అందాన్ని ఆరాధిస్తా—ఆత్మీయతకు ప్రాణం ఇస్తా
అనుభవాలను మనసు నిండా నింపుకుంటూ
అందమైన రంగులతో వాటికి అద్దం పడుతూ
మనస్సులోని భావాలను మదించి
రంగులను రంగరించి నా చిత్రాలకు ఊపిరిగా,
కాలిన రైల్లోని కంకాళాలు చిత్రించాలా
భాగ్యనగరులోని దౌర్భాగ్య కిరాతక చర్యలు చిత్రించాలా—
రామ మందిర తగవులు చిత్రించాలా—
విశ్వశాంతికై విసరిన శాంతి కపోతం
రెక్కల నడుమ కురిసే నెత్తుటి ధారలు చిత్రించాలా—
అర్థం కావడంలేదు — అంతు పట్టడం లేదు
ప్రపంచమంతా పంచరంగుల చిత్రంగా వెయ్యాలని
కాని ఏరంగులో కుంచె ముంచినా
ఎరుపురంగుదప్ప ఏరంగూ కనుపించడం లేదు
స్ఫటికం నుండి, శ్వేతం వరకు
ఇంద్ర ధనస్సులను వర్తింప చేయాలని
చిత్రంగా చరిత్ర కారుణిగా నిలవాలని ఉంది

# ఆకాశపు ఒడి

– వై.వి. మునీందర్ కుమార్

మనసు గదిలో మువ్వలు కదిలిన సవ్వడి
వెన్నెల వేదికపై మరుమల్లెల పరిమళం
పడమటి కొండల్లోని సంధ్యాకాంత చీకటంచు చీరపై
పరచుకొని నిశధీరాత్రి
నలుదిశలా ఆవరిస్తున్న మలయమారుత తొలి సమీరం
మబ్బుల పల్లకీల జ్ఞాపకాల యవనికల్లోంచి
వినిపిస్తున్న మౌన వీణాలాపనలో వింతపోకడలు పోతున్న కొత్త
స్వరాల గమకాలు
ఆశ స్వప్నపు తోటలో ఎద ఎదను తాకేందుకు
పుడమిపై పరచుకొన్న పారిజాతాలపై వాలిన
మంచు బిందువుల్లా నా కళ్లు ఏక దృశ్యాలు రాస్తున్నాయి
కొన్ని క్షణాల జీవితం.... లేని పల్లవికి
బతుకు పాటకు మాటలు పొదుగుతోంది
తెగిపడిన గుప్పెడు తీగలను సరిచేసి బిగిస్తోంది ఆశ
కానీ.... .... సరిగమలు మరచిన కాలం గొంతులో గురగుర–గరగర
రాలిపడుతున్న నక్షత్రాలు లక్ష్యాల సమాధులకు పునాదులౌతున్నాయి
ఎగసి ఉరకలు వేసే జన సముద్ర తరంగాలు
విస్పష్ట ఘోశలో ఘోషాలేని అశరీరవాణి
పెదవులు కదపటం నేను కళ్లార చూశాను
ధ్యానమల్లిన రేపటి గీతకు మొట్ట మొదటి చరణాన్ని దక్షిణాన
దాగియున్న లోయల్లోకి
గాలి విసురుగా ఎగరేసుక పోయింది
హమ్మయ్య ప్రారంభమయింది అలజడి,
అదిగో చూడండి ... ఉదయం
అద్దుకొంటున్న ఆకాశపు ఒడి

---

ఇం. నెం. 5–11–98/2, విద్యారణ్యపురి, హన్మకొండ

# ప్రకృతి

— "ఉషాకిరణ్"

ప్రత్యూష వేళలో
లత ప్రసవించిందో పుష్పాన్ని
సుగంధ పరిమళంలో
మధు మకరంధంతో
అలరారే ఆ కుసుమం
ప్రభాకరుని సెగ చూపులకు
బలై రెక్కలను రాల్చింది.
నిరాశలేని
అలసట ఎరుగని
ఆ పూల తీగె
జన్మ నిచ్చింది
మరో కుసుమానికి॥
మళ్లీ ఉదయానికి

# యువతరమా నీ పయనమెటు?

— సి. వేణుగోపాల్

భావి భారత పౌరులమని
భారత మాత ఒడిలో పెరిగి
కాశ్మీరు లోయలో కారుచిచ్చై
పంజాబు గుండెలో బడబాగ్నియై
తెలుగు గడ్డమీద నక్సలిజమై
మతాల ముసుగులో నిప్పు కణికవై
గమ్యంలేని తోకచుక్కవై సాగుతున్న
ఓ యువతరమా! నీ పయనమెటు?

అల్లర్లు, దోపిడీలు, హింసలు
హత్యలు, మానభంగాలు
మాదక ద్రవ్యాల మత్తులో
రౌడీఇజం, గూండాయిజం
నిజాలు కాని ఇజాలలో జీవించు
ఓ యువతరమా! నీ పయనమెటు?

మిణుకు మిణుకు మంటున్న
భారతమాత ఆశా జ్యోతిని
చావవున్న నీ చేతులతో ఆదుకో
అవినీతిని, వరకట్న, నిరుద్యోగ
పిశాచాల్ని చావగొట్టి తరిమి కొట్టి
బాపూజీ, నెహ్రూజీల పసిడి కలలు పండించు
ఓ యువతరమా! నీ పయనమిటు ఇటు... ఇటు....

# నేటి సమాజం

- జక్కోజు సుదర్శనం

అవినీతి సహజమైపోయింది
సంపన్నులు-
వినియోగ సంస్కృతి
వలలో చిక్కుకున్నారు

రాజకీయాలలో
సంపన్న వర్గం
ఆధిపత్యం వహించి
ఆత్మ విశ్వాసం కోల్పోయింది

రాజకీయ వాదికి
పెదవి విరుపుతోనే
పెదవి కోల్పోవడంతో
అగ్ని పరీక్షయింది

బరువులేనిది కాగితం కదలదు
కమీషను లేనిది కంట్రాక్టు కుదరదు
అధికారులు అధికారంకై
ఆత్మవిశ్వాసం కోల్పోతున్నారు.

ఇం.నెం. 11-27-152, బ్యాంకు కాలని-1, వరంగల్-506 012

# సమగీతి

— ఉదయగిరి

అసమానత్వాలెంతో కాలం ఉండవు లేవోయ్
బానిస భావాలను వదలినప్పుడు
దొరా . నీ బాంచన్ః కాల్మొక్తనన్నప్పుడు
— ఎక్కడిదోయ్ అసమానత్వం

స్త్రీ అంటే ప్రకృతియని
సృష్టి ధర్మానికి రూపొందిన భేదమేనని
తెమిలితే మన సమాజం
— ఎక్కడిదోయ్ అసమానత్వం

ప్రజలే తమ ప్రభువులని
రాజకీయులు ఎరిగినప్పుడు
గుర్తెరిగి పాలకులు సేవకులమని భావిస్తే
— ఎక్కడిదోయ్ అసమానత్వం

మానవత్వమె మహోన్నతమని
అల్పులు అధికులు సమైకమౌతూ
కలిసి కదిలి సమగీతిక లాలపిస్తే
ఇంకానా అసమానత్వం —
ఇంకెక్కడి అడ్డుగోడలు

ఇం.నెం. 16–2820, రామలింగాపురం, నెల్లూరు–524001

# స్నేహబంధం

– యల్. వేణుగోపాలరావు

నేస్తం
ఆకాశమంత ఎదిగినా
విరాట పురుషునివి కానేరవు
నింగిని, నేలను కూల్చినా
సమర యోధునివి కానేరవు
శత సహస్రకోటి శిరచ్ఛేదనలు జర్పినా
గిన్నిసు బుక్కులో చేర్చ బడనేరవు
కాని....
కమ్మని మాటలతో
విశ్వాన్నే జయించేవు
స్నేహ బంధాలతో
మనుగడకే వన్నె తెచ్చేవు.

క్వార్టర్ నెం. 5, టి.ఎన్.జి.వోస్. కాలనీ, వడ్డెపల్లి, వరంగల్.

# కొక్కొరోకో!

— శీలం రాజేశం

భాగ్యనగరం పాత బస్తీ రక్తసిక్తం
అన్య మెరుగని
ఆడుకునెడి చిన్న పాపలు
ఆడ పిల్లలు—అన్నదమ్ములు
అక్కసుగొన్న రక్కసి కత్తులు
ముక్కలుగా నరికి ప్రాణములు గొన్నవి!
కుక్కిన పేను రాజకీయం
కొక్కరకోయని
శాంతము నేర్పుతున్నది
పగసాధింపుల
పాగావేసి తోటివాని
ప్రాణాలను కోసెడి
పార్టీ చేష్టల పరాకాష్ఠ ఇది!
పాపం! పరామర్శిస్తూ....
ఓట్లను లాగెడి నికృష్టపు నీతి ఇది
మతం మాటలు — పట్టి కూతలు!
కట్టిపెట్టుము — ఈర్ష్యాద్వేషం
మార్ఫియా మత్తులో — మట్టిగరిచెడి
మానవత్వం మనసు నెరుగుము

ఇం.నెం. 5-9-25, లష్కర్ బజార్, హనుమకొండ — 50600

# మంటలు – మరణాలు

– గులాం నబి

పతుల చితుల మంటలలో
సతుల సహగమనాల మరణాలు
మతాచార పేరుననే మచ్చలు
మానవ వివేక నేత్రాలకు మసకలు

డబ్బుకు దాసులైన భర్తల అక్రమ బాధల
ఆరని మంటలలో అమాయక భార్యల మరణాలు
జాతి వర్గ భేదాల చిచ్చును రెచ్చగొట్టే శాసనాల మంటల్లో
ఆలోచనాలోచనాలు లేని యువ ఆవేశపరుల మరణాలు
కామంకాటున, క్షామం మాటున, తీరని అప్పులు, వీడని ముప్పులు
ఎలక్షన్‌లో ఓడుట–పరీక్షలో తప్పుట
మంటల మరణాలకు మరెన్నో కారణాలు–కాగా
"కాకతీయ ట్రేను" మంటల్లో కారణాల కలగాంచని మరణాలు
విశ్వం దద్దరిల్లేలా "సద్దాం" సిద్ధం జేసిన యుద్ధభూమి
అమెరికా మారణాయుధాల పరీక్షల ప్రయోగశాలై
శాంతి రక్షణ పేరిట ప్రేల్చిన కక్ష సాధింపుల మంటల్లో
లక్షలాది మానవ మరణాల విజయాలు
(వీటికి మూలకారణం)
మహాప్రపంచ ప్రాణుల్లో – మాన్యులైన మానవుల్లో
దైవభక్తి లోపించగ – పాపభీతి స్ఫురించక
ప్రేమానురాగాలు కరువై – ఈర్ష్యా ద్వేషాలు విరివై
దానవతల కండ్ల మంటల్లో – మానవతల మరణాలు
ఓ ఉగాదీ! నీసాలువారి చరిత్ర పుటలలో
ఇంకెన్నెన్ని క్రొత్త అనుభవాల చేర్పులో

3-4-84/బి, రాయపుర, హన్మకొండ–506 011

# రసగుళిక

– వరిగొండ కాంతారావు

విత్తు చూచి నవ్వకోయి
పాతి నాక చెట్టుచూడు.

కులముబట్టి ఎంచకోయి
గుండెలోతు తరచిచూడు.

అందముంటె చాలదోయి
అతివకు మనసుండాలి.

ఆటగెలిచి కాదోయి
ఓడినపుడు నవ్వాలి,

కవిత వింటె సరిపోదోయ్
స్పందన పరమావధి మరి,

డెవలప్‌మెంట్ ఆఫీసరు, ఎల్, ఐ.సి. ఆఫ్ ఇండియా, రామాయంపేట 50

# స్నేహోషస్సు

— ఎమ్. శాంతి ప్రియ

రాగాల ఉషస్సులో
ఉషోదయపు తేజస్సులో
పౌర్ణమినాటి నీ హృదయాకాశంలో
నేనొక తారను నేస్తం!
అమావాస్య లాంటి నా హృదయాకాశంలో
నీ వొక చిరుదివ్వెవు.

ఓ స్నేహ విపంచి ....
నీ హృదయ సంద్రంలో నేనో స్నేహ అలనైపోతే
నీ ప్రతి అడుగులో నేనో లయనైపోతే
నీ పాద ధూళిలో నేనో రేణువునైపోతే

ఓ స్నేహామృత మూర్తి ....
నీకు తోడుగా నేను తటిల్లతయై పోతే
నీ జీవన సంధ్యా రాగంలో
నేనొక పవన వీచికనై పోతే

ఈ జన్మలో ఇక నిన్నేమీ కోరను నేస్తం.

ఇం, నెం. 2-1010-బి-1:6-1బి, వి.వి. కాంప్లెక్సు దగ్గర
శ్రీనివాసనగర్ కాలని, హన్మకొండ-506001